# పీఠిక.

కథాంశమంతయు గ్రంథమునఁ గలదుగానఁ బీఠికలో వ్రాయకం వహానితిమి. ఈగ్రంథమువ్రాసినకవులు వరవకవితానిపుణులు. వీరి కవిత్వము కేవలద్రాక్షాపాకముగ దేశీయములతోడను స్వభావ వర్ణనలతోడను గూడియున్నది. కథానాయికయగు తిరుపతమ్మ సహగమన మొనర్చుటకుఁ బూర్వభాగమున వీరువ్రాసినపద్యములు ఎట్టిమూఢునకైన పతివ్రతాప్రభావమును మనస్సునకుఁ జొచ్చునటుల బోధింపక పోవు. పూర్వము సహగమన మొనర్చిన యువతీమతల్లుల కుత్సవాదులఁ జేయుటయు దైవ

భావముఁ గోదిలకించుటయు మనదేశీయుల కాచారమైయున్నది. ఈ
తిరుపతమ్మయు నట్టిది. ఏనాఁడో యశశ్శరీరముఁదాల్చి చరిత్రవ్యాపిని
యైన యీతిరుపతమ్మకథనంతయుఁ జిన్నపాత్తముగ నొనర్చి భాషాపతి
కూడిగ మొసర్చిన గ్రంథక రలగు మాకరాః నారాయణరాజు కోలా
హాలము సీతారామరాజుల కవితాకన్య కోలఁదికాలమున నక్షరస్వరూ
పిణియై ప్రబంధరచనానంతరమున లోకమున పిలసిల్లఁగలదని య్యాచిన్న
పాత్తము చెప్పక చెప్పుచున్నది. గ్రంథము సాధ్యమైనంతవఱకు నిర్దు
ష్టముగ వ్రాయఁబడెనని తోఁచుచున్నది. "మునేఁటి, తిరుపతిమ్మ"
గోనగుపదములు దోషములని యొఱంగియుఁ గథాపాశబద్ధులై

యుక్తిం చిరని మా తలంపు. ఏదేనిలోపములున్న క్షమించి యీ బాలకవుల యుద్గ్రంథములో సర్వరసజ్ఞు లనుగ్రహింతురుగాక!

ఇట్లు

శేషాద్రిరమణకవులు శతావధానులు సోదరులు,

కుమారరాజావారి

ఆస్థానకవులు.

గింపలగూడెము
4- [illegible]—1916

# అభిప్రాయము

ఓ బాలకవులారా!

మీరు రచించిన ,,తిరుపతమ్మ,, యను గ్రంథము వ్రాఁత ప్రతి నాద్యంతము, శ్రద్ధతోఁ జదివి, నిర్దుష్టమని యే, యభిప్రాయపడితిని. శైలి మృదుమధురముగ నున్నయది. మీ కవిత వాగీశ్వరీకరుణచే దినదినాభ్యుదయముఁ గాంచుఁగాత. సర్వేశ్వరుఁడు మీ కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిఁ గలుగఁజేసి మిమ్ము భారతదేశమునకు మేల్పుత్త్రులఁ జేయుఁగాత.

ఇట్లు

గంపలగూడెం
19—1—16

కోటగిరి వేంకటకృష్ణారావు,
బహద్దరు, కుమారరాజా.

శ్రీకరుఁడు ప్రాణికోటిని • సృష్టిఁజేయు
కమలగర్భుని కడుపారఁ • గన్న మేటి
యైన శ్రీవిష్ణుదేవు పా • దాంబుజమున
గంగతోనుద్భవించిరి • కమ్మవారు.

వ॥ వారిలో

సీ॥ సిరికినివాసమై • చెలువారు క[illegible]టి
వంశాంబురాశి జై • వాతృకుండు
విమలసద్గుణగణ్యా • హీరమాంబాసంగ
యాఖ్యులఁదనరించు • నట్టిసుతుఁడు
పతిభక్తియేమహా • వ్రతముంచు నేవేళ
భావించు లింగాంబ • ప్రాణభర్త

చిటిముటిమాటలఁ • జెవులపండువొనర్చు
చిన్నికృష్ణునిఁ జేర్చెఁ • గన్నతండ్రి
గీ॥ సుగుణగణ భూషితుండును • సుందరాంగుఁ
డతుల ధీశాలి శ్రీయప్ప • యాహ్వయుండు
బసులానంద మొప్ప నీ • పుస్తకంబు
నచ్చువేయించి యిచ్చె మా • కాదరమున
ఉ॥ శ్రీయుతుఁడై నయాఘనుని చెల్మి కతంబున మాకరాజు నా
రాయణరాజు శ్యాలకుఁ డ • నారత మొజ్జగఁ దున్కి పాటిలో
హాయిగ నుండఁగాఁ గలిగె • నట్టిమహాత్ముని ప్రాపె సర్వదా
బాయక మాకుఁ గల్గఁగఁ గృ • పానిధి దేవుఁ డనుగ్రహించుత॥

శ్రీ

# తిరుపతమ్మ

తే॥ గీ॥ ఈ చరాచర భూతంబు లెల్లయెడఁ
బుట్టుటకు వృద్ధిఁగనుటకుఁ గిట్టుటకును
గారణంబైన యాజగత్కర్త నెపుడుఁ
బ్రస్తుతింతుము మా మనఃపంకజముల॥

మ॥ కవులున్ గాయకులున్ వదాన్యులును సంస్కారుల్ బుధశ్రేణివే
దవిదుల్ వాహినులున్ బతివ్రతలు భక్తవ్రాతమున్ మేదినీ

ధవళులై వీరులు లోహాముల, ఖలుగో • త్రంబుల్ స్వకీయ ప్రభో

ద్భవముల్ గాఁగ జెలంగునో, రతమా • తా! నీకుఁ గేల్మోడ్చెదన్

చ॥ అనుపమభోగభాగ్యముల నబ్బుచుఁ గొల్చుచుఁ బాడిపంటలం

దునఁదుల లేనిదై, పలుకుఁ • బ్రయ్యలికిన్ జెలువంపుటున్కియై,

కనదురు సౌధరాజముల • గల్గి, జగంబున నందిగామ సీ

మను "పెనుగంచిప్రోలు" ; • వాఁబుగ నొప్పనుదంచితస్థితిన్

శా॥ వేదంబుల్ జదువుంచి ప్రపచ సుమర్ల్ • విధ్వస్తమున్ జేయుచున్

భేదంబేమియు లేక సర్వజనులన్ • బ్రేమించుచున్, శాంతిదాం

త్యాదుల్ గల్గి నిరంతరంబు నిగమ • వ్యాసంగమున్ జేయుచున్

భూదేవోత్తములుందు రప్పురమునన్ • పూజ్యత్వమున్ గాంచుచున్॥ 3

చ॥ వితరణశాలురై యధిక । విత్తములుం మడిమాన్యములుం గవి
ప్రతతికొసంగుచుం మి[illegible] • శ్రావ్యములై నుతిం గాంచినట్టిస
త్కృతులను దాము[illegible]నును • నెల్లపుడుం హృదయపవిర్ధితా
దృతినిం బురాణపాళిం బఠి[illegible] •యించుచునుందురిని యోగులప్పురిన్ । 4
చ॥ ధనదులెయప్పురింగల వ • దాన్యులుకోమటు లట్లుగానిచో
వనయమువచ్చు నాశ్రితుల • కందఱికిం మితియంతయుందుం[illegible]
ప్పనలవిం గానిద్రవ్యమును • బంచియొసంగుచు నుండినం గొలం
తనుగపకుండ నెప్పుడు ధ•నప్రథితంబునుగాంచ నేరుతో । 5
చ॥ హాలముఖద త్తభాగ్యమున • నాదరభావముతోడ వీఁకసా
పలకునుదానధర్మములు • దారలెం జేయుచుం బండితప్రకాం

దులభజియించి మంచియుండె • దుర్గ్రహియించుచు ధర్మమార్గని
స్తులమతిఁ బాయకుండుదురు • శూద్రులు తత్పురమందు నెప్పుడున్॥ 6

మ॥ హనుమంతుండు శివుండు కృష్ణుఁడు నృసిం • హస్వామి భేతాళమూ
ర్తి నగేంద్రాత్మజ దేవళంబులపయిన్ • దీపించు శిల్పంబులన్
గనఁగా మున్నటి యాంధ్రశిల్పుల మహా • న్నత్యంబుఁ దెల్లంబుఁగా
గనులన్ గట్టినయట్లు కన్పడును ద • ద్గ్రామంబునన్నేఁటికిన్ 7

చ॥ వెనుకటి నాఁడియానగరు • పెద్దదటంచును నెందఱో
అనుకొనుచుంటఁ గాకయివు • డారయఁగా యవనావనీశుఁ బ్రా
ర్థన భవనద్వయంబు విధు • రంబుఁ యికన్నకు నేమహామ్మదీ
యనృపతి పాలనంబున మ • హామహిమంబుగ నొప్పుచుండెనో॥ 8

ఉ॥ ఆపురికిం గురంగట న • హర్నిశముం బ్రవహించుఁ బంకజా
తోపరిభాగభృంగనిక • రోదితమంజుర వప్రకాశితా
లాపము, సైకతాకరక • లాప, ముభంగ తరంగ సంచయ
వ్యాపితముం, సుధామధుర • వారియుతంబు మునేటిసొంపుగన్ ॥ 9
చ॥ జలరుహనేత్ర లెల్లనుబు • జాబుల బిందియలుంచి యున్నదీ
సలిలముఁ దెత్తురయ్య భయ • సంధ్యలఁ వారలమోవికావి ది
క్కులఁ గలయంగ రాగవ న • గూర్చినటంచుఁ గవుల్ భ్రమించి ని
చ్చలు సరసప్రబంధముల • సారెకు వర్ణనఁ జేయునల్లుగన్ ॥ 10
ఉ॥ ఆ మునియేటి నానుకొని • హాళినిఁ గూర్చుచు నామ్రభూమి
రామచయం బహార్పతిక • రప్రకరప్రతి బంధకంబు, సు

త్రామవనోపమానము ని • రంతర సమ్మద దాయకంబు నై
యామనియందునన్ బికశు • కారవముల్ సెలఁగన్ జెలంగెడిన్ ॥11॥
వేసవికాలమునన ర • విప్రభలన్ గడుడస్సి పాంధులా
యాసము మీఱ నాయుపవ • నావళియందున విశ్రమింపగా
భానునిలీలఁగోయిలలు • పాడ మనోఘనతాపత ప్తతన్
గాసిలు చంద్రోకప్పుడప • కారము లేయ పకారముల్గదా ॥12॥
ముని యేటికానక • ట్టనుగట్టదానిచేఁ
గడచుచునుండెను • కాలువలును!
కాల్వల సలిలసం • గ్రహణంబు నను గొలం
తలు లేకపండుకే • దారములును!

కేదారతతులను • త్పాదితంబగుధాన్య
నిబిడీకృతభవన • నికరములును!
భవననికరముల • పరిపూర్ణమైజెలు.
వైకానవచ్చుచు • న్నట్టివీధు!
గీ॥ లట్టివీధులలోపల • నాడుచుండు
బాలికా బాలకలుగల్గి • పరగునట్టి
పురముఁగాంచినఁ గన్నుల • కఱవుఁదీఱుఁ
దీఱనిముదంబు మదికిఁజే • కూరుకతన॥
గీ॥ అపురమ్మునఁ గమ్మవం • శాబ్ధినంబు
జాలయువిధంబుననుబుట్టు • వందె నొక్క

క్షుధాదిమాంబువఁ బాధలునా • సుతియొనర్ప
స్థిరమతికిఁ బట్టుకొమ్మ శ్రీ • తిరుపతమ్మ॥ 14

గీ॥ పూవుబుట్టినతోడనే • తావిఁగొల్పు
ననవిరీతిగ బాల్యంబు • నందె సకల
సద్గుణావాసయై నిజ • సఖులతోడ
నాడుకొన్న నామెఁ జపులకా • హ్లాద మొదవ॥ 15

సీ॥ యౌవనమంకురించుటయు • నాసతినిర్ణ సుగుణాలవాలుఁ దుర్
భావభవప్రాపమాంగనవ • భాస్వరరూపవిభాసితుండు, వి
ద్యావిశదుండు గోపయన • మాఖ్యఁ జెలంగెడువానికిచ్చి మో
దావహచిత్తులై చుఁ దలి • దండ్రులు పెండిలిఁ జేసిరంతటన్। 16

సీ॥ అనురాగమునవిద్ద • ఉల్లారుముద్దుగా
నెడఁబాయకెపుడుఁజ రించుచుంద్రు
సౌఖ్యంబునందేని • సంకటంబుననేసి
పతిసతుల్సగపాలు • పంచుకొంద్రు
గృహకృత్యములనునే • కీభావముగనిద్ద
ఱాలోచనముఁజేసి • యాచరింతు)
గురుజనంబులనిర్వు • రురుభక్తిఁబూజల
సమముగాసత్యంబు • సల్పుచుందు
గీ॥ ఎల్లకార్యంబులనునిర్వు • రేకభంగిఁ
గలిసిమెలఁగుటచేతనా • కాపురంబు

భూతలస్వర్గమట్లు సం • పూజ్యమగుచుఁ
దీఱనిముదంబుతో డవ • ర్ధిల్లుచుండె॥ 17

సీ॥ పరిహాసమునకైన • బొరపాటుగానైన
బొంకియెఱుఁగని • పుణ్యశీల!
బీదసాదలనుసం • ప్రీతితో నరయుచు
సాహాయ్య మొనరించు • సదయహృదయ!
సకలభూతంబుల • సత్కృపారసమగ్న
మానసంబునఁజూచు • మాన్యచరిత!
తనవారుఁ బెఱవార • లనుభేదమాత్మలో
వీడివర్తించుసా • ధ్వీమతల్లి!

గీ॥ వినయసంపత్తివలరారు • విశ్వవినుత!
సుగుణభావలధరియించు • సుందరాంగి!
ఆత్మనాథునకర్ధాంగి • యగుచుఁగడుఁబ్రీ
తివహియించె నీరీతిఁ • దిరుపతమ్మ! 8

గీ॥ కాపురమునందులోపము • ల్గలుగకుండఁ
బుట్టినింటికి మఱిఁదాను • మెట్టినింటి
కిని యశంబును మిగుల నా • ర్జనముఁజేసె
సంభ్రమాంతరంగంబుల • జనులువొగడ! 19

క॥ పతియు సతి యధికమైత్రిని
గతిపయదివసములు భోగ • కాంతులనుండఁ

సుతులుద్భవించిరార్య
స్తుతిమంతులు రూపవిజిత • సూనప్రదరుల్ ॥ 20

చ॥ వివిధసుఖంబులిట్లనుభ • వించుచు నిద్దఱుగూడి పెక్కునా
ళ్లవితథరాగసంపదలు • నందఁగ నాసుగుణాత్మభర్త కా
లవశముచేత మేనునుతో • లంగెను శాశ్వతదేహధారులై
యవనివసించువారలెవ • రైనను లేరుగదా? తలంపఁగన్ ॥ 21

చ॥ పతి తనుబాసి • యువ్విధిని • స్వర్గపురంబున కేఁగ నాపతి
వ్రత తనమానసంబునను • రంతవిషాదము నొంది యింకపై
బ్రతికిననేమిలాభమగుఁ • బ్రాణపదంబగు భర్త లేనిచో
వెతయగుచుండఁగాదె యలి • వేణులజన్మము లుర్విలోపలన్ 22

సీ॥ జనులెల్లఁ జూచిమె • చ్చఁగ నేమహాభాగుఁ
డగ్ని సాక్షిగఁ బెండ్లి • యాడెనన్ను
అక్రాంత మేపద • యాంతరంగుఁడు తన
ప్రాణంబురీతిఁ గా • పాడెనన్ను
కోరికల్ దీర్చి యే • గుణగణ్యుఁడెల్లప్పు
డంచితాదృతిని మ • న్నించెనన్ను
అనయంబుఁ గష్ట మ • న్నంత లేకుండ నే
ప్రేమాస్పదుఁడు సుఖ • పెట్టెనన్ను
గీ॥ అట్టినాహృదయేశ్వరు • ననయమాస్మ
దీయహృత్పంకజమున వ • ర్తించువాని

నామనోరథనిధిని మ • న్నాథువీడి
నిలువశక్యమె భూమిపై • నిముసమైన। 23

ఉ। కావున సంశయంబువిడి • కాంతునితోడను స్వర్గసీమకుఁ
బోవుట శ్రేయమౌ సుకృత • ముల్ బొనరించిన తత్సమానముల్
కావు నిజంబుగా మునువు • కాంతులతో దివికేగి యొందటే
భూవలయంబులోన యశ • ముఁగనియుండరు శాశ్వతంబుగన్ ।24

క। అని సహగమనముఁ జేయఁగ
మనమునఁదలపోసి యత్త • మా: కును ద
క్షినబాంధుజనులకును వం
దనమొనరించి సెలవుఁగొని ము • దంబుననంతన్ । 2

గీ॥ పసపుఁగుంకుమ భూషలు • వస్త్రములు ము
దంబునను నేలవేల్పు ము • త్తైదువలకుఁ
బంచిపెట్టుచు జనులెల్లఁ • బ్రస్తుతింప
వెడలె సహగమనముఁ జేయ • విభునితోడ॥ 26

సీ॥ భువి భగవత్యంశ • భవగాళయున్న నీ
పగిదిఁ జేయు నెయంచుఁ • బలుకువారుఁ
బతికంటె పతికి దై • వము వేఱ లేఁడంచు
నన నీమెతార్కాణ • యనెడువారుఁ
దొలిపుట్టువున నెంత • సలిపెనో పుణ్యంబు
జనుచుండె నాథుతో • ననెడువారు

ఇట్టి పుణ్యాంగన • నీక్షించుటం జేసి
మనము ధన్యులమైతి • మనెడువారుఁ
గీ॥ బతులయెడ భక్తిఁ గలిగిన • సతులపేరుఁ
జెప్పుటకుముందు నీమె నే చెప్పవలయు
ననుకొనుచునుండు వారు నా • యమను జూచి
నతిశతంబులు భక్తి నొ • నర్చువారు॥ 27

చ॥ సకలసుఖంబులన్ జనులు • సన్నుతిఁ జేసెడురీతి నాత్మనా
యకుఁడును దాను నొందియును • నంత నెమానసముందుఁ దృప్తి నొం
దక మరలన్ బతిన్ గలసి • నాకసుఖంబుల నందఁ గోరి యా
యకలుషితాత్మ యేగెడున • టంచుఁ బ్రజల్ నుతియింపుచుండఁగన్

మ॥ జనులెల్లన్ దనవెంటరాఁగ ముదిత • స్వాంతంబుతో నివ్విధిన్
జనియా యాయుగ్మలిఁ యగ్ని హోత్రునకు హ • స్తద్వంద్వమున్ మోడ్చి భ
క్తినిఁ గావించి ప్రదక్షిణంబు జనులెం • తే విస్మయస్వాంతులై
తనువీక్షింప నిమీలితాక్షియగుచున్ • ధ్యానించెనీరీతిగన్ 29

చ॥ అలిగిననీవు లోకముల • కప్పుడె ముప్పుతటస్థమౌ దయా
కలితుఁడవైన యప్పుడు జ • గంబులు చల్లగనుండు నన్నుఁగా
నలవిమెసిన్ను గావున ద • యామహితాత్మ నాథుతో నను
గలుపఁగదయ్య కాయము నె • కానుక గాఁగొని హవ్యవాహనా ॥ 30

మ॥ రమణుంబీడఁగలేక యిత్తఱి నస్వ • ర్గంబాద నన్మచ్ఛరీ
రము నీరీతిఁ దృజించుచుంటి నిఁక స్వ • ర్గంబాదినన్ మేలె ! త

థ్యముగా జన్మములుం డనేని యింక • నో దైవంబ ! నాకెన్ని జ
న్మములఁ గల్గఁగఁ జేతువన్నిటను మ• న్నాథుఁ జేర్చఁ జేయుమా ౹౩౧౹
బంధుగులార ! పోయెదను • స్వర్గపురంబునకంత్యమైన నా
వందనముఁ గ్రహింపుఁ డిఁక • భావములోఁ బలనుంచఁ జోకుఁడే
నెందున నేనియుఁ దెలియ • కెగ్గులుఁ జేసితి నేని యింక మీ
రందఱు దుఃఖము న్విడచి • యాత్మలలోన ముదంబు నందుఁడీ ౹౩౨౹
అని యీవిధంబుగఁ జూ
చినవారలు మనముకలఁతఁ • జెందుచు నుండన్
దనుని శ్ఛేప్టితులై కను
గొనుచుండఁగఁ దిరుపతమ్మ • కుతుకముతోడన్ ౹ ౩౩

సీ॥ పాండువసుంధరా • పాలునితో "మాద్రి"
సహగమనంబును • సల్పినట్లు
నలరాజుతోడ ని • శ్చలమతిఁ "జేరాంబ"
సహగమనంబును • సల్పినట్లు
నారసింహాప్పరా • ణ్ణాథుతో "జానకి"
సహగమనంబును • సల్పినట్లు
వేంకటాద్ర్యప్పరా • ద్విభునితో "సీతాంబ"
సహగమనంబును • సల్పినట్లు
గీ॥ పతులతోడిద లోకంబు • సతులకనుచు
స్వాంతమందెంచి పతితోడ "సహగమనము"

సలిపె జనులెల్లఁ దన్ను సం • స్తవముఁ జేయ
స్థిరమతికిఁ బట్టుగొమ్మ (శ్రీ) తిరుపతమ్మ॥ 34

చ॥ పతి దివికేగినంతటనె • ప్రాణము నేనియు భక్తితోఁ సమ
ర్పిత మొనరించునట్టి సుచ • రిత్రల నాంధ్రపురంధ్రులన్, పతి
వ్రతలను, సత్సతీమణులఁ • బావనశీలలఁ గీర్తనీయ ధీ
మతులను, పూజ్యరాంద్రనుసు • మంబులఁ బూజనొనర్పఁ ల్లదే॥ 35

ఉ॥ రావణు లంకలో మునుపు • రాక్షసులెంతగ బాధఁ బెట్టినన్
భావమునందు "సీత" పతి • భక్తిని వీడగ లేదటన్న నీ
భూవలయంబులోపల స• త్పూర్వమటందురు కొందఱట్టివా
రీ వనితామణిన్ గనిన • నెన్నఁటి కేనటు పల్కనేర్తు— 36

గీ॥ ధరణిలోపల నాచంద్ర ♦ తారకముగఁ
పేరునిల్చునటంచు సం ♦ ప్రీతితోడ
నాలయమ్ముఁగట్టించి ధీ ♦ శాలురెల్లఁ
జెలఁగి యేటేటఁ దిరునాళ్ళఁ ♦ జేయుచుండ్రు॥ 37

ఉ॥ పూతచరిత్రమైమిగులఁ ♦ బూజ్యతఁగాంచిన తిర్పతమ్మకీ
రీతిగ నాలయంబొకటి ♦ సృష్టియొనర్చి మహాత్ములెల్ల సం
ప్రీతిగ నుత్సవాదులొన ♦ రింపఁగ బోయినచోఁ బతివ్రతా
ఖ్యాతిజగంబునందెటుల ♦ వ్యాప్తముఁగాంచి స్థిరత్వమూనెడిన్॥ 38



శ్రీ

# ఉత్సవప్రారంభము.

సీ॥ కమ్మసంతాన మే • యమ్మ పుట్టువుచేత
స్థిరతరకీర్తినా • ర్జించినదియో!
గుణగణోజ్జ్వలుఁడైన • గోపయామాత్యునక
ర్ధాంగియై యేతన్వి • యః రినదియో!
భగవత్సమానుగా • భర్తను దలఁచి యే
చెలువ సద్భక్తిన • ర్చించినదియో!

గతించిన వెన్క • బ్రతుకు వ్యర్థమటంచు
సేవాధ్వ తను వగ్ని • కిచ్చినదిరయొ!
గీ॥ బాపురే! మృతజీవయర్ణ • బ్రజలనుడికిఁ
బాత్రియై యేసుశీల లో • కత్రయమున
వన్నెకెక్కె నా! స్థిరకీర్తి • వలననట్టి
తిరుపతమ్మ వేడుకఁ జూచి • తీఱవలయు! 39
సీ॥ అంబయేశాసట్టు • లనతరించెనటంచు
నెంచి సద్భక్తిఁబూ • జించువారు
ఆపత్సమయమందు • నాదరించినతల్లి
యంచు మొక్కులుదీర్చు • నట్టివారుఁ

గోరివగోరికల • గాదవలేకయదీర్చు
నిలువేలుపని కాన్క • లిడెడువారు
ఫలపమూహాంబు లు • పాయసంబుగఁదెచ్చి
మించు భక్తిని సమ • ర్పించువారుఁ
సీ॥ కలిగిజ్యోతిర్మయూత్కుంభ • ము లనుగలిగి
చిత్రితర వాద్యములనువి • చిత్రమగుచు
ధూపదీపమంగళహార • తుల వెలుంగు
తిరుపతమ్మ వేడుకఁ జూచి • తీఱవలయు॥
సంతానవాంఛచే • స్నానముల్ఁజేసి " పా
నాచారము " ల్బడు • నట్టిసతులు

ముప్పుఁగల్గిన నాఁడు ◆ మ్రొక్కినట్టుల "గండ
దీపముల్" వెలిగించు ◆ దీనజనులు
జననకాలంబునం ◆ దునఁబల్కినట్లుగాఁ
"బుట్టువెండ్రుక"లిచ్చు ◆ పుణ్యమతు
లిష్టమౌ కోరిక ◆ లీడేర్చనని భక్తి
"నిలువుదోపు"లొసంగు ◆ నిశ్చలాత్మ
గీ॥ లతినియతిఁ బుష్పములఁ గూడ ◆ నర్చనంబుఁ
జేయుచు నివేదనంబు వి ◆ శేషభక్తి
నర్పణముఁ జేయుజనములం ◆ దందఁ జెలఁగు
తిరుపతమ్మ వేడుకఁ జూచి ◆ తీఱవలయు॥ 41

సీ॥ ప్రభల మూఁదాలీఢ • పాదులై శాక్తేయు
లల్లల్ల శరభాయ • టంచుఁజదువ
కాలకు మొఱ్ఱఁగా • రాదంచుఁగ్రై స్తవుల్
నాస్తికవాదము • నర్చుచుండ
తంబురఁ జేఁబూని • దాతలం గదసిజం
గమువార లోకవంకఁ • గథలుజెప్ప
రామ! హరీ! పరం • ధామ! యటంచుఁ గొం
దఱు భక్తవరులు కీ • ర్తనలుపాడ!
గీ॥ గుహులముందఱఁ గుంపుగాఁ • గూడిముద్దు
లొప్పమీఱఁగఁ గొందఱు • జెప్పుచుండఁ

కనులపండువౌనర్వఁగా • గలుగునట్టి
తిరుపతమ్మవేడుకఁ జూచి • తీఱవలయు! 42

సీ॥ తల్లిద డ్రులఁబాసి • తాగుమాత్రైన బి
డ్డలనెల్లఁ దల్లిదం • డ్రులకుఁగల్పి
నేరుతాయినివవా • నేరుతాయిగఁదూఁచు
సావుకారులనెల్ల • సంప్కరించి
తడబాటుఁ గన్పట్టి • మెడేనగల్క త్తిరిం
చెడి గరానులనెల్ల • శిక్షఁజేసి
మద్యపానంబున • మత్తెక్కిరేయుడలుగు
త్రొఱుఁగసివారియ • ల్లరులమాన్పి

గీ॥ ఒత్తుగా నిపైనిఁబడుటకు • నుద్యమించు
వారి వారించి మొప్పడ • వ్వారిగాఁగఁ
బరగుచుండె సురటిక • భటులుగలుగు
తిరుపతమ్మ వేడుకఁజూచింతీవలయు, ॥ 43

సీ॥ బాణాంగనలభంగి • నుద్యద్ద్యుతుల్గల్గు
గానులకై సేసి • కదలువారు
దేవాంగనలభంగి • దేదీప్యమానపా
డాలజాకెల్లచేఁ • గ్రాలువారు
నాగాంగనలభంగి నవ్యమాణిక్య భూ
షలఁ జేర్చిధరియించి • మెలఁగువారు

రాజాంగవలభంగి • రమణీయనవాజ సౌం

దర్యంబునుంగల్గి • తనరువారు

గీ॥ నాగరములు, నానులు, త్రాలు• వగలు, ముదవుఁ

గలుగఁజేయు ముచ్చటముల్గఁ • గలిగికనుల

కింపుఁగలిగించువారిచే • నింపఁబడిన

తిరుపతమ్మవేడుకఁ జూచి • తీఱవలయు! 44

సీ॥ పద్మంబుపైని ష • ట్పదములకైవడి

మోమునముంగురుల్ • మురువుఁజూపఁ!

డోరంపురతనాల • దుద్దులకాంతులు

గండస్థలంబుల • గ్రమ్ముకొనఁగఁ

గాళ్ళకమర్చిన • కటకంబు గొండొంటి
నిండ ఘల్లను • నినదము సేయఁగ!
గంటుముసంగల • కనకహారావళుల్
కుచకుంభములమీఁదఁ • గునిసియాడ!

గీ॥ సమదగజయానలెల్లను • శ్వాహాపూరి
తార్మలై యచ్చటచ్చట • నలరియున్న
వింతలంజూచు నాసత్తి • వెడలునట్టి
తిరువతమ్మ వేడుకఁజూచి • తీఱువలయు! 45

ఏవంకఁగనుఁగొన్న • నిరుకవేసిన గాల
కంతట నిండిన • యట్టిప్రజలె!

ఏదారిఁగనుఁగొన్న • నడఁబాటు లేకుండ
బారుబారులుఁ గల్గి • వచ్చుప్రభలె!
ఏదాయఁ గనుఁగొన్న • నీడు వారలఁగూడి
వేడ్కతోఁ బందెము • వేయువారె!
ఎచ్చోటఁగనుగొన్న • నిచ్చవచ్చినయట్లు
సంచరించెడిగణా • చార్యగణము!
గీ॥ ఎచటఁగనుఁగొన్న బేరంబు • లిష్టమున్న
తెఱఁగునం జేయుచుండెడు • ధీరమతులె
కలిగియుంపారుచుండ న • క్కజముఁగాఁగఁ
దిరుపతమ్మ వేడుకఁ జూచి • తీఱవలయు! 46

దామోదరు దశావ ౹ తారముల్ తమయందు
గల "వ్రిభ" లోకవంక • వెలయుచుండ!
మహత్పూర్వులచరిత్ర • లనుఁబ్రదర్శించెడు
"కంపెనీ" లోకచాయఁ • గ్రాలుచుండ!
విశ్వంబునంగల • వింతలన్నిటిఁజూపు
"బైస్కోపు" లోకక్రేవఁ • బరగుచుండ
క్రూరమృగంబులం • గొని తెచ్చియాడించు
"సర్కస్సు" లోకచోటఁ • జరుగుచుండఁ
గీ॥ గడువిచిత్రంబుగాఁ గను • కట్టుఁగట్టి
"గారడీ"చేయుచున్నట్టి గారడీంద్ర

తోడఁ జూపరులకు వింతఁ • దోఁపఁ జేయు
తిరుపతమ్మ వేసుకఁ జూచి • తీఱవలయు ॥ 47

శా॥ బారుల్ దీరిచియంగడుల్ సాగముగాఁ • బట్టుంపు బాజారుల
ట్లో రాజిల్లుచునుండ, బేరులుముదం • బేపారవ్యాపారముల్
ధీరోదారతఁ జేయుచుండ, సుజను • ల్దీనిన్విలోకించి, "గుం
టూరో! బందరో", యంచుఁబల్కుటలు విన్పట్టారంబుగా దేవికిన్ ॥

ఉ॥ కాళుల గజ్జియల్ కగయు • గంబువఁ దాళములం గ్రహించిభ
క్త్యాళి ముదంబుతోడ వల • యాకృతినిల్చి యనేకదీపికల్
గ్రాలెడు స్తంభమొందుచును • గంగను మధ్యను, భక్తితోడ నీ
లాలలనా మనోహరుని • స్తోత్యమొనర్తురు నృత్యపద్ధతిన్ ॥ 49

వ॥ పిత్రుదత్తనమువలనవచ్చుధనమును, 50

చ॥ క్రమముగ ధర్మకర్తలున్న • కార్యముగా మదినెంచి ధర్మస
త్రములకు సత్కవీంద్రులకు • బ్రాహ్మణకోటికి నర్థమావివా
హములకుఁ బాతకాలలకు • సంగవిహీనుల కాలయాదికా
ర్యములకొసంగు చుందురు ఖ • ధావళినన్నుతిఁ జేయునట్లుగా ॥ 51

సీ॥ తనజన్మమున నెప్పు • డును గనుంగొనవట్టి
చోద్యంపువస్తువుల్ • చూపఁజాలు!
ఎక్కడెక్కడనో వ • సింపుచునుండెడు
చుట్టాలనొకమాటె • చూపఁజాలు

ముగ్ధత్వమంత • మొదలంటనశియింప
సూక్ష్మబుద్ధికిదావెఁ • జూపఁజాలు
మితిలేనివర్యాలనెల్ల • నేత్రపర్వంబొన
ర్చుచుదృష్టిదీరఁగాఁ • జూపఁజాలు
నవ్యమానవసందర్శ • నమునవాగ
రకతఁగలిగింపఁజాలు నా • ర్యస్తుతంబు
లైనయీయుత్సవంబుల • నరయుటనవ
దూషణముఁగాను విజ్ఞాన • భూషణంబు॥ 52
తే॥ గీ॥ ఉత్సవంబును గనుఁగొను • టొప్పిదంబె
కాని బలిచియొసంగుటే • కాదుముంకు

సరిఁ డదటఁచు సింహుక • సంశయింతు
మొల్లరకుఁ దృప్తిగాఁ జెప్ప • నేరితరము॥ 53

ఉ॥ శ్రీకర సమస్తజన • సేవితమై భువన ప్రసిద్ధమై
యాకలి ప్రజాళియు • యాచితవస్తు విధానమైయుక్త
త్యాకర సుందరంతికలు • పాపహారంబు దక్షపీయుమై
లోకము నెప్పుడు వె • లుఁగుత నుత్సవ మావిధంబుగన్ 154

సంపూర్ణము.



